# నీలకాంత్

సాయంత్ర మయేసరికి తుఫాను ఉధృతం కా సాగింది. కుండపోతలా వర్షం కురుస్తోంది. ఆ మెరుపులు, భయంకరమైన ఉరుములు, వీటన్నిటినీచూడగా దేవదానవ సంగ్రామంతో ఆకాశం దద్దరిల్లి పోతున్నట్లుంది. చీకటి ధ్వజంలా నల్లని కారుమేఘాలు ఆకాశాన్ని కప్పివేశాయి. క్రోధావేశంలో వున్నట్లు గంగానది నురగలు గ్రక్కుతూ ప్రవహిస్తోంది. గాలికి ఓడినట్లు నది కిరు తీరాల వున్న చెట్లు తలలు వంచి ఊగుతున్నాయి; కానీ, అంతలోనే వాయుదేవునిపైకి యుద్ధానికి పోయినట్లు తలలెత్తి భయంక రంగా హోరు పెడ్తున్నాయి.

అటువంటి సమయంలో చంద్రనాగూరులో నదీ తీరాన ఒక యింటిలో భార్యాభర్త లిద్దరి కీ క్రింది విధంగా సంభాషణ జరుగుతోంది :

'కొద్దిరోజులు ఇంకా ఇక్కడే వుంటే నీఆరోగ్యం మరికొంత బాగుపడవచ్చు. ఇందుకు నీ అభిప్రాయం ఏమిటి ?' అని అడిగాడు భర్త శరత్.

'నా ఆరోగ్యం బాగానేవుంది. ఇంటికి వెళ్తే వచ్చే ప్రమాద మేమీ ఉండదనే నా అభిప్రాయం.'

ఈ విషయంలో వా రిద్దరికీ చాలా తర్జనభర్జన జరిగింది. కాని చివరకు కిరణ్ కన్నీళ్ళు పెట్టగానే సంభాషణ మరోవిధంగా నడిచింది.

'ఇంకా కొద్దిరోజులు ఇక్కడే వుండమని చెప్తున్నాడు డాక్టరు' అన్నాడు శరత్-భార్య కిరణ్‌తో.

'మీ డాక్ట రెక్కడ! మీ డాక్టరికి అన్నీ తెలుసులే!' అంది కిరణ్.

'ప్రస్తుతం ఎక్కడచూచినా జబ్బులే. వాతావరణం సరిగాలేదు. ఒకటి రెండు నెలలు పోతే బాగుంటుంది' అన్నాడు శరత్.

'ఇప్పటికి ఈ క్షణంలో అంతా క్షేమంగానే ఉన్నాముగా!' అంది కిరణ్.

అసలు జరిగిం దేమంటే-కిరణ్‌కు జబ్బుచేసింది. ఇంట్లో అందరికీ ఆమె అంటే చాలా యిష్టం. అందుకని కిరణ్‌కు జబ్బుచేసిందంటే అందరూ చాలా గాబరా పడిపోయారు. డాక్టరు గాలిమార్పు అవసరమని చెప్పాడు. గ్రామస్థులకు ఇది విడ్డూరంగా కన్పించింది.

'ఊఁళ్ళో ఇంకెవరి భార్యలకు జబ్బు చేయలేదా ఏమిటి? ఈయనగారి భార్య వెళ్ళేచోట ఎవరి భార్యలకూ

జబ్బు లేకుండా వున్నారా! అక్కడ ఎవరూ మరణించరా ఏం?' అని అనేకవిధాలుగా ఎగతాళి పట్టించారు. కాని కిరణ్, అతని తల్లి ఎవరి మాటల్ని లెక్క చేయలేదు. గ్రామస్థుల ఎగతాళిని గాలికి ఎగరగొట్టి, ప్రయాణ సన్నాహాలు చేసుకున్నారు. ఆ సందర్భంలో శరత్, భార్యను చంద్రనాగూరుకు తీసుకువచ్చాడు. కొంచెం ఆరోగ్యం చిక్కింది. అయినా చాలా బలహీనంగా ఉంది. ఆమె ముఖమంతా లోతుకు పీక్కుపోయి, పాలిపోయిఉంది.

నలుగురుతో కలసి నవ్వుతూ, పేలుతూ కులాసాగా కాలక్షేపం చేయటం కిరణ్ స్వభావం. అటువంటిది ఈ నదీ తీరాన ఏకాంతంగా ఉండటమంటే ఆమె కేమాత్రం మనస్కరించలేదు. చేయటాని కేమీ పనీ లేదు. పలకరించేందుకు ఇరుగు పొరుగు, మరెవ్వరూకూడా లేరు. రోజంతా ఈ మందులు పత్యాలతో గడిచిపోతోంది. ఈ విధంగా ఉండటం ఆమెకు మహా దుర్భరంగా వుంది. తుఫాను ఉధృతంగావున్న ఆ సాయంత్రం ఈవిషయాన్ని గురించే చర్చ జరిగింది.

కిరణ్ ఏదో ఒకమాట అంటూనైనా ఉంటే వాద వివాదానికి అవకాశం ఉంటుంది. కాని మాట లేమీ లేకుండా ముఖం ప్రక్కకు త్రిప్పుకొని ఏడుస్తూకూర్చుంటే

ఇహ ఆత డేమీ వాదించడు. పాపం! అపజయంతో మౌనం వహిస్తాడు. చివరికి సంభాషణలో ఆ కన్నీళ్ళు చూడగానే ఇక లొంగిపోవడం మంచిదను కుంటున్నాడు. ఇంతలో నౌకరు ఏదో కబురు చెప్పటానికని గదిముందుకు వచ్చి పిల్చాడు.

శరత్ లేచి వెళ్ళి తలుపు తెరచి ఏమిటన్నట్లు చూశాడు.

ఒక పడవ తుఫానులో చిక్కుకొని మునిగిపోయిందని, అందరూ మునిగిపోగా ఒక బాలుడుమాత్రం ఈదుకొని ఒడ్డుకు చేరగలిగాడనీ, తోట సమీపాన మెట్లవద్ద స్పృహతప్పి పడిపోయాడనీ చెప్పాడా నౌకరు.

కిరణ్‌కు ప్రాణం లేచివచ్చింది, ఆ మాట వినేసరికి. కుర్రాడికి తెలివిరాగానే పొడి బట్టలిచ్చింది; అప్పటి కప్పుడు వేడిచేసి ఒక కప్పు పాలు త్రాగించింది.

'ఇక్కడికి నువ్వెలా వచ్చావ్!' అని అడిగింది.

తన పేరు నీలకంఠుడని, నాటకాల కంపెనీలో పని చేస్తున్నాననీ, నాటకం ఆడటానికి తాము ఈవూరే వస్తూవుండగా తుఫానుకు పడవ మునిగిపోగా తనకు ఈత బాగా తెలుసును గనుక తేలిగ్గా ఒడ్డుకు చేరుకోగల్గినట్లు చెప్పాడతడు కిరణ్‌తో. ఆనాటినుంచీ ఆ పిల్లవాడు వాళ్ళతోనే

వుంటున్నాడు. మృత్యుముఖం నుంచి తప్పించుకొని బయట పడినందుకుగాను కిరణ్ ఇతనియందు ఒక ప్రత్యేక శ్రద్ధ చూపేది. ఈ పిల్లవాడు రావటం కిరణ్‌కు సంతోషంగా వుందిగదా యని శరత్ చాలా సంతసించాడు. శరత్ తల్లికూడా తనకోడలు ఈ పిల్లవానితో కులాసాగా కాలక్షేపం చేయగల్గుతున్నందుకు సంతోషించింది. అందరి కంటె నీలకంఠునికి మరింత సంతోషంగా వుంది. తనను నానా బాధలుపెట్టే ఆ నాటక కంపెనీ మేనేజరు చేతుల్లోంచి బయట పడినందుకూ, అంతేగాక తాను ఒక ధనిక కుటుంబానికి ప్రేమ పాత్రుడైనందుకూ అమితానందం కల్గింది.

కానీ, కాలంగడిచేకొద్దీ ఉద్దేశ్యాలు మారసాగాయి. శరత్, అతని తల్లి, ఈ పిల్లాడెప్పుడు ఇంటినుంచి విరగడై పోతాడాయని ఎదురుచూడసాగారు. అతడు పోవాలనే వారి కోరెక్క. ఎవరూ చూడకుండా ఈ పిల్లవాడు శరత్ హుక్కా పీల్చేవాడు. శరత్‌యొక్క సిల్కుగొడుగు వేసుకొని ఠీవిగా బజార్లన్నీ తిరిగొచ్చేవాడు. కన్పించిన ప్రతి మనిషితో స్నేహం చేసుకునేవాడు. ఒక కుక్కనుకూడా పెంచుతున్నాడతడు. ఆకుక్క సరాసరి శత్‌గదిలోకి ప్రవేశించి మంచంమీద దొర్లి పరుపునిండా మట్టిచేసేది.

గదంతా అసహ్యంగా తయారయేది, దాని ఆగడాలతో. అల్లరి పిల్లకాయల్ని ప్రోగుచేసి కొంటె పనులు చేస్తూ వుండేవాడు. మామిడి తోటల్లోకాయలు పెద్దవై చేతికోస్తా యనే ఆశ లేకుండా పోయేది. అతడు చేసేవన్నీ ఇటువంటి దుండగాలే.

ఈ విధంగా అతడ్ని పాడుచేయటంలో కిరణ్ పాత్ర ప్రధానమైనది. ఈ విషయాలన్నీ ఆమెతోచెప్పి శరత్ హెచ్చరిస్తూనే వుండేవాడు. కానీ కిరణ్ ఈచెవితో విని ఆ చెవితో వదిలేసేది. శరత్ తీసేసిన పాతబట్టలు, ఇంకా ఎన్నో క్రొత్తబట్టలు కుట్టించి ఇచ్చేదతనికి. అత నంటే ఏదో తెలియని ఆకర్షణ పని చేసేది, ఆమెలో. ఎప్పుడూ అతడ్ని తన గదికి పిలిపించుకొనేది. అతణ్ణి గురించి తెలుసుకోవాలనే కాంక్ష పీడిస్తూ వుండే దామెకు. మధ్యాహ్నం స్నానం, భోజనాలయ్యాక కిరణ్ తాంబూలం సేవిస్తూ తీరిగ్గా కూర్చునేది. ఆ సమయాల్లో నీలకాంతుడు ఆమెను సంతోషపర్చటానికి అనేకరకాల అభినయం చేస్తూ, పాటలు పాడుతూ ఆడేవాడు. అప్పుడప్పుడు కిరణ్ అద్భుతమైన ఈ నాటకాన్ని చూసేందుకు శరత్‌నుకూడా ప్రేమికునిగా ఆహ్వానించేది. కానీ, ఈ పిల్లాడియందు వుండే అసంతృప్తివల్ల ఆమె ఆహ్వానాన్ని నిరాకరించే వాడు. ఒకవేళ అంతగా అతడు హాజరయిన రోజున నీల

కాంతుడు హృదయపూర్వకంగా రోజూఅంత బాగా నటించేవాడు కాదుకూడా.

ఇతని అల్లరిపనులు సహించలేక శరత్ అప్పుడప్పుడు చెవులు మెలేసేవాడు. కాని ఇటువంటివి అతనికొక లెక్కా ? నాటకం కంపెనీలో వున్నప్పుడు ఇంతకంటే ఎక్కువ బాధలే సహించాడు. ప్రపంచంలో పొందిన ఈ కాస్త అనుభవంతోనే నీలకాంతుడు, ఈ భూమిపై, నీళ్ళ నేల రెండు ఎలా వుంటాయో మానవ జీవితంలోకూడా అలాగే కష్టం, సుఖం అనేవిరెండూ వస్తూవుంటాయని గ్రహించాడు.

నీలకాంతుని వయస్సు నిర్ణయించటం కష్టమైన పనే. 14,15 ఏళ్ళుంటాయనుకొందామా అంతకంటే చాలా పెద్దవాడే నన్నట్లుంటుంది అతనిముఖం. పోనీ పదిహేడో పద్దెనిమిదేండ్లో వుంటా యందామంటే అన్నేళ్ళు ఎక్కువేమో ననిపిస్తుంది. పెద్దవాళ్ళలోనూ లెక్కకు రాడు, అంతమాత్రాన చిన్నపిల్లవాడనీ అనలేము. నాటకాలలో సీత, దమయంతి మొదలగు స్త్రీ పాత్రలు ధరించేవాడు, అందరూ అతణ్ణి చిన్నవాడే అంటారు. కానీ ఇప్పుడిప్పుడు నీలకాంతునిలో ఒక అస్పష్టమైన మార్పు అతి తొందరగా కలుగుతోంది. అంతకుముందు స్త్రీ

పాత్రాభినయం చూపమని కిరణ్ అడిగితే చాలు నిస్సం కోచంగా నటించేవాడు, కాని ఇప్పుడు సిగ్గు పడటం ప్రారంభించాడు. కిరణ్ తనను చిన్నపిల్లవాడిలా ఆదరించటం చూసికూడా సిగ్గు పడేవాడు. ఇందుకు కారణం అడిగితే అతడూ చెప్పలేడు.

నీలకాంతునికి కిరణ్ ఇంట్లో ఏమీ పని వుండేది కాదు. అందుకని శరత్‌గారి ఏజంటువద్ద నాలుగుముక్కలు చదువైనా నేర్చుకుందామనుకున్నాడతడు. కాని ఏజంటుకు నీలకాంతు దంటేనే గిట్టేదికాదు. నదిఒడ్డుకు పోయి పుస్తకం తెరుచుకొని చూస్తూ కూర్చునేవాడు, నీలకాంత్. గలగల ప్రవహించే నది, పక్షుల కిలకిలారావాలు చెవిని పడేవి, చూపులు పుస్తకంలో వున్నా, మనసు మరొకచోట వుండేది. అక్షరం ముందుకు నడిచేది కాదు. తన చేతుల్లో ఒక పుస్తకం వుందనే విషయమే మర్చిపోయే వాడు. అటు ఏదైనా పడవపోతూ కనిపించగానే పుస్తకంలోకి చూస్తూ బిగ్గరగా చదివేవాడు. మళ్ళీ అది ముందుకు వెళ్ళిపోగానే ఆలకించే ప్రేక్షకు లెవరూ లేనందువల్ల చదవటం ఆపేవాడు.

ఇంతకుముందు అతడు ఏదో అనాలోచితంగా పాటలు పాడేవాడు. కాని ఇప్పుడు వాటి రాగాల మీద

మనస్సు పోతోం దతనికి. ఆ పాటల్లోని భావాలెలా వున్నా వాటిని అర్ధం చేసుకునే శక్తి తనకి లేకపోయినప్పటికీ గొంతెత్తి బిగ్గరగా పాడుతూవుంటే ఇప్పుడతనికి తాను మరో ప్రపంచానికి పయనమై పోతున్నట్లనిపించేది. తన జీవిత మంతా సంగీతమయంగా భావించేవాడు. రాకుమార్తె బాతుకథ గుర్తుకువొచ్చే దతనికి. వెంటనే ఆ రాజకుమార్తె సౌందర్యం అద్దంలోవలె అతని మనస్సులో ప్రతిబింబిం చేది. ఆ క్షణాన అత దేవూహాలోకాల్లో విహరించేవాడో ఏయే వూహాసౌధాల్ని నిర్మించుంకొనే వాడో కాని నిజంగా తాను చేత కాసయినా లేని ఒక నిరుపేద బ్రాహ్మణ కుర్ర డిననే యదార్థాన్ని మరిచిపోయేవాడు. పైగా అత నొక నూతన వూహాలోకంలో విహరించేవాడు. స్వప్నాల్ని అల్లు కుంటున్నాడు. ఆ స్వప్నాధి దేవతగా, ఆ ఊహాలోకానికి మహాసామ్రాజ్ఞిగా, ఒకదేవతగా కిరణ్‌ని ప్రతిష్ఠించుకునే వాడు. సున్నితమైన ఆమె హృదయం, పుష్ప దళాలవలె సుకుమారంగా ఉండే ఆమె కరచరణాలను, అందమైన ఆమె ముఖం-వీటన్నిటిని తన మనోఫలకంమీద చిత్రించు కొనేవాడు. ఈ కల కరిగిపోగానే తాను మాత్రమే మిగిలి వుండేవాడు ఒంటరిగా. అంతలో ఎవరో ఫిర్యాదు చేయగా శరత్ అక్కడికి వచ్చి చెవులు మెలేస్తూ, 'ఏంరా వాళ్లె

వరితోటలోనో మామిడి కాయలు కోసుకువచ్చావటగా ?'
అని నిగ్గతీసేవాడు. ఆ తర్వాత ఆతోటను ఇంకాస్త పాడు
చేసిరావాలని తనవానరసైన్యంతో బయలుదేరి వెళ్ళేవాడు.

వేసవి శలవుల్లో శరత్ తమ్ముడు సతీష్ ఇక్కడికి
వచ్చాడు. కిరణ్‌కు ఇప్పుడు ఇంకా హాయిగా కాలం గడిచి
పోతోంది. మరదిని ప్రతివిషయంలోనూ ఎగతాళిపట్టించేది.
అతణ్ణి విసిగించేందుకు ఒక్కోసారి వెనగ్గావచ్చి కళ్ళు
మూసేది. లేకపోతే అతడు చూడకుండా వీపుమీద 'కోతి'
అని వ్రాసేది. ఒక్కొక్కప్పుడు గదిలోపెట్టి బయట
గొళ్ళెం వేసి నవ్వేది. సతీష్‌కూడా వదినగారి తాళాల్ని
దొంగిలించి దాచటమో, ఆమె త్రాగే కాఫీలో ఉప్పు
కలపటమో, ఆమెను మంచానికి కట్టివేయటమో చేస్తూ
ఆడించేవాడు.

ఆ సమయాన నీలకాంతుని మనోస్థితి ఆ దేవునికే
తెలియాలి. అతనికి తెలియకుండానే అతని మనస్సులో
ఎవరి మీదో ఏదో అసూయ, ద్వేషం కలగసాగాయి.
కారణం లేకుండానే తన మిత్రుల్ని కొట్టేవాడు. కుక్కను
అనవసరంగా తన్నుతూ వుండేవాడు. దారివెంట పోతూ
పోతూ కన్పించిన చెట్టునల్లా కర్రతో బాది విరగగొడుతూ
వుండేవాడు.

కడుపునిండుగా తినేవాళ్ళంటే కిరణ్‌కు చాలా ఇష్టం. అందుకని ఈ బ్రాహ్మణపిల్లాడి భోజనం విష యంలో ఆమె చాలా శ్రద్ధ తీసుకునేది. తానే స్వయంగా భోజనం పంపేది. దగ్గర వుండి మరీ భోజనం చేయించేది. కాని, సతీష్ వచ్చిన తర్వాత ఆ విషయంలో ఆమెకు తీరిక చిక్కటం లేదు. అతడు భోజనం చేస్తున్నాడోలేదో చూడటానికి ఆమె రావటం అరుదైపోయింది. ఇంతకు ముందు ఎప్పుడైనా ఒకవేళ కిరణ్ రాలేకపోయినా నీల కాంత్ తినగలిగినంత వరకు సుష్టుగా భోంచేశేవాడు. కాని ఆమె లేకుండా ఇప్పుడతనికి తినాలంటే మనస్క రించటం లేదు. ఏమీ తినకుండానే లేచిపోతున్నాడు. ఆకలి గాలేదని నౌకరుతో చెప్పి విచారంగా లేచి వెళ్ళిపోయేవాడు. ఈవిధంగా భోజనం మాని వెళ్తే నౌకర్లు కిరణ్‌తో చెబుతా రనీ, అప్పుడప్పుడామె వచ్చి తనను ప్రతిమాలు తుందనీ అతని ఆశ. కాని అతడు ఆశించిన విధంగా జరగలేదు. కిరణ్‌కు ఈ విషయం అసలు తెలియనేలేదు. చీకటిగదిలో ఒక్కడే పడుకొని ఏడుస్తూ వుండేవాడు. తలగడ పూర్తిగా కన్నీటిలో తడిసిపోయేది. ఇంతకూ ఏమి జరిగిందో, ఇందుకు ఎవరిని నిందించాలో, తనబాధకు కారణం ఎవరో ఇవన్నీ ఏమీ అర్థమయేవి కాదు, కానీ అతని మనస్సు మాత్రం బాగా గాయపడింది.

సతీష్ తన మీద కిరణ్‌తో ఏవేవో చాడీలు చెప్పి ఆమె మనస్సు విరిచేస్తున్నాడనే దృఢ నిశ్చయానికి వచ్చాడు నీలకాంత్. కిరణ్ ఏదైనా పరాకుగా వున్నా, నవ్వకపోయినా సతీష్ ఏదోచెప్పి వుంటాడనే అతని అను మానం. 'ప్రభూ! వచ్చేజన్మలో నేను సతీష్‌గాను, సతీష్ నేనుగానూ జన్మించేట్లు ఆశీర్వదించు!' అని దేవుణ్ణి ప్రార్థించేవాడు. తన బ్రాహ్మణకోపం వృథా పోదనికూడా నమ్మే వాడు. సతీష్‌ను మనస్సులో ఎంతగాశపించేవాడో, అంతగా అతను దిగులుపడి పోయేవాడు. అత దంటేనే మండిపడే వాడు. ఇంత శపిస్తున్నా సతీష్ - వాళ్ళ ఒదిన నవ్వులు కిందికి వినిపిస్తూనే ఉండేవి.

సతీష్‌మీద తన కున్న ద్వేషాన్ని ఎన్నడూ బయటకు వ్యక్తం చేయలేదు. చేయ సాహసించేవాడు కాదు. కాని ఏదోనిధంగా పగ సాధించుకొంటూనే వుండేవాడు. ఒకనాడు సతీష్ నదికి స్నానానికి పోయాడు. సబ్బుపెట్టె మెట్లమీద పెట్టి మళ్ళీ తిరిగి వచ్చేప్పుడు చూస్తే అది అక్కడ కన్పించలేదు. చొక్కా ఒడ్డున ఉంచి, నదిలో దిగి స్నానంచేస్తూవుండగా కాస్సేపటి కది నదిలోకొట్టుకు పోతూ కన్పించింది. ఒకవేళ గాలికి ఎగిరివచ్చి పడిందేమోనని సరిపుచ్చుకున్నాడు సతీష్.

సతీష్ వినోదం కోసమని ఒకనాడు కిరణ్, నీల కాంత్‌ను తన గదికి పిలిపించింది. వచ్చి చాలా కోపంగా మెదలకుండా నిల్చున్నాడు! కిరణ్ ఆశ్చర్యంగా 'అలా ఉన్నావేమిటి ?' అని అడిగింది. జవా బేమీ చెప్పలేదు. నీలకాంత్, ఏదైనా ఒక పాట పాడమని అడిగింది. నా కేమీ గుర్తు లేదు అని విసవిస నడిచివెళ్ళిపోయా డక్కడి నుంచి.

ఇంకా వా ళ్ళక్కడ మూడు రోజులు మాత్రమే వుంటారు, ఇంటికి వెళ్ళిపోవటానికి సామాన్లు సర్దుకుం టున్నారు. చాలా హడావిడిగా వుంది. సతీష్‌కూడా వాళ్ళ వెంట వెళ్ళడానికి ప్రయాణమవుతున్నాడు. నీలకాంతుని విషయమే పట్టించుకో లే దెవ్వరూ. అతడు వస్తున్నాడా, లేదా అనే శ్రద్ధ ఎవరికీ ఉన్నట్లు కనిపించటం లేదు. ఆ విషయాన్ని కిరణ్ ప్రస్తావించింది. కానీ శరత్, అతని తల్లి అందుకు పూర్తిగా వ్యతిరేకించారు. దానితో కిరణ్ మెదలకుండా వూరుకుంది.

అతణ్ణి చాటుగా పిలిపించి 'నువ్వింక తిరిగి మీ యింటికి వెళ్ళిపో !' అని సలహా యిచ్చింధి. చాలా రోజు లనుంచి ఆమె తనతో ప్రేమగా మాట్లాడటం వినలేదు. ఇవాళ హఠాత్తుగా వినేసరికి దుఃఖం ముంచుకొచ్చింది.

'అదేమిటి! అంత పెద్దవాడు కూడాను. ముద్దులా ఏడుస్తా డెందుకు?' అని ఈసడించుకున్నాడు సతీష్. కిరణ్కు ఆ మాట విని కోపం వచ్చి సతీష్ను మందలించింది.

'వదినా! నువ్వు అసలు విషయాన్ని అర్థంచేసుకో వటం లేదు. నీమనస్సు తీరే అంత' ఎక్కడినుంచోవచ్చిన వీడిని మహారాజులా పోషిస్తున్నావు. ఏనాడు పిల్లిని పులి అవమంటే అవుతుందా! కన్నీరు చూస్తే సున్నితమైన నీ హృదయం కరిగిపోతుందని వాడు బాగా పసి గట్టాడు' అన్నాడు సతీష్ ఆమె మందలింపుకు జవాబుగా.

వెంటనే అక్కడినుంచి నీలకాంతుడు వెళ్ళి పోయాడు. 'నేగనుక ఏ కత్తినో అయివుంటే నిన్ను ముక్కలుగా తరిగే వాడిని. లేక నేనే ఏ అగ్నినో అయి వుంటే నిన్ను నిలువునా కాల్చి బూడిదచేసి వుండేవాడిని' అన్నట్లుగా చూశాడు సతీష్ వంక బయటకు వెళ్తూ.

కలకత్తా నుంచి వచ్చేప్పుడు సతీష్ ఒక ఇంకుస్టాండు తీసుకొచ్చాడు. పడవమాదిరిగాఉండి, ఒక వెండిబాతు దానిని లాగుతున్నట్లుగాఉంది. సతీష్కు అదంటే చాల ఇష్టం. తన సిల్కు జేబురుమాలుతో రోజూ దాని నతడు తుడిచి శుభ్రంగా వుంచేవాడు. దానిని గురించి కిరణ్ నవ్వుతూ ఎప్పుడూ ఏదో ఎగతాళిగా మాట్లాడేది. దానితో ఇద్దరూ

వాదించుకొనేవారు. వారు బయలుదేరటానికి ముందురోజున ఆ ఇంకుస్టాండు ఉండవలసినచోట కన్పించలేదు. 'ఏమై పోయింది అబాతు ? దమయంతికి ప్రేమజాబు తీసుకు పోయి వుంటుందంటావా ?' అని నవ్వుతూ అడిగింది కిరణ్.

కాని సతీషుకు చాలా కోపంగా వుంది. ఈ పరిహాసాన్ని వినిపించుకున్నట్లు లేదతడు. దానిని నీలకాంతుడే దొంగిలించి వుంటాడని అతని నిశ్చితాభిప్రాయం. రాత్రి అతడు తన గదిలోకి తొంగిచూస్తున్నప్పుడు చూసిన వారున్నారు. వెంటనే నీలకాంతుణ్ణి కిరణ్ సమక్షానికే పిలిపించి, 'ఏయ్ దొంగా ! దానిని నువ్వు దొంగిలించావా; లేదా ? ఎక్కడ దాచావో వెళ్ళి తీసుకురా' అని అరిచాడు సతీష్.

శరత్ ఎలా శిక్షించినా కిక్కురు మనకుండా సహించేవాడు. అటువంటిది కిరణ్ ఎదుట సతీష్ తనను 'దొంగా' అని పిలిచేసరికి సహించలేక పోయాడు నీలకాంత్. కళ్ళనుంచి నిప్పులు రాలుతున్నాయి. క్రోధంతో మండిపోయాడు. అంతకుమించి సతీష్ మరొకమాట అని వుంటే, పులిలా అతనిమీద విరుచుకుపడి రక్కి చర్మం చీల్చి వుండే వాడే !

కిరణ్ ఆ దృశ్యాన్ని చూచి భరించలేక పోయింది. వెంటనే నీలకాంత్‌ను చాటుకు తీసుకుపోయి ముద్దుగా 'నీలూ! నిజంగా నువ్వు తీసుకుంటే వెంటనే తెచ్చి నా కిచ్చెయ్యి. నిన్నెవరూ ఏమీ అనరు' అని అంది. నీలకాంతుడు రెండుచేతుల్లో ముఖం దాచుకొని వెక్కి-వెక్కి ఏడ్వసాగాడు. కిరణ్ తిరిగి సతీష్ వద్దకువచ్చి 'సతీష్, నీలకాంతుడు దానిని తీసుకోలేదు' అని చెప్పింది. శరత్, సతీష్ లిద్దరూ అతడే తీశాడని నొక్కి-చెప్తున్నారు. కిరణ్ మాత్రం వారిమాటల్ని నిరాకరించింది.

'అయితే అతని పెట్టె తెరిచి చూద్దాం రండి' అని సూచించాడు సతీష్.

'ఆ విధంగా గనుక జరిగితే నేను నిన్ను క్షమించను సతీష్!' అంది కిరణ్. ఆమెకు మాట తడబడింది. కళ్ళనిండా నీళ్ళునిండాయి. అంతటితో మరెవ్వరూ ఆ విషయాన్ని ప్రస్తావించలేదు.

'పాపం! ఆ దిక్కు-లేని పిల్లాడ్ని వీళ్ళెంత నిర్దాక్షిణ్యంగా చూస్తున్నారు?' అని ఆలోచించి ఆమెకు అతనిపై జాలి కలిగింది. రెండు జతలు కొత్తబట్టలు, ఒక చెప్పుల జత, ఒక వందరూపాయల నోటు తీసుకొని నీలకాంతుని గదిలోకి వచ్చింది. ఎవరూ చూడకుండా తా

మెలాగూ వెళ్ళిపోతున్నాం గనుక ఈ బహుమానాలను అతని పెట్టెలో పెట్టిపోవాలని ఆమె వుద్దేశ్యం. తనవద్ద వున్న తాళంచెవితో నెమ్మదిగా పెట్టె తెరిచింది. పెట్టె నిండా సామానులు చిందర వందరగా పడున్నాయి. ఈ బహుమానాలన్నీ పెట్టెలో పట్టేట్లు లేవని, వాటన్నిటినీ తీసి మళ్ళా క్రమంగా సర్దాలనుకొంది. చాకులు, పుల్లలు, అద్దంముక్కలు ఇంకా ఇటువంటి సామాన్లతో పెట్టె నిండివుంది. పెట్టె అడుగుభాగాన బట్టలక్రిందవున్న ఇంకు స్టాండును హఠాత్తుగా చూసింది. నిశ్చేష్టురాలై దానివంక తదేకంగా చూస్తూ అలాగే కూర్చుంది. అదే సమయంలో మెదలకుండా తనగదిలోకి ప్రవేశించాడు నీలకాంతుడు. దొంగను కనుక్కొనేందుకు వచ్చి తనపెట్టెను వెదికిందనీ తన దొంగతనం పట్టుబడిందనీ భయపడ్డా డతడు.

'నేను దొంగనుకాను. ద్వేషంతో సతీష్‌పై పగ సాధించటానికే నేను దీనిని దొంగిలించాను' అని ఎలా నచ్చచెప్ప గల డామెకు? అందుకు నిదర్శనం ఏముంది?

తానా వస్తువునుదొంగిలించాడనే ఆమె భావిస్తుంది. కాదని ఎలా చెప్పగలడు?

అతడే దొంగ అనే భావంతో కిరణ్ నెమ్మదిగా ఇంకుస్టాండును మళ్ళీ అడుగునవుంచి, పైనబట్టలుసర్దింది. అన్నీ సర్ది పైన తానుతెచ్చిన బహుమతు లుంచింది.

మరునాడు నీలకాంత్ ఎక్కడా కన్పించలేదు. అత డెక్కడికి వెళ్ళిందీ ఎవరికీ అంతుచిక్కలేదు. ఆ గ్రామంలో ఎవరికీ కన్పించలే దతడు.

'అతడి పెట్టెలో ఏముందో చూద్దాం!' అన్నాడు శరత్ కుతూహలంగా. అందుకు కిరణ్ ఎంతమాత్రం అంగీకరించలేదు. వెంటనే ఆ పెట్టెను తన గదిలోకి తెప్పించుకొంది. ఎవరూ చూడకుండా ఇంకుస్టాండునుతీసి నదిలో పారవేసింది.

అందరూ తమ స్వగ్రామం వెళ్ళిపోయారు. ఇక్కడ నిర్జనమై పోయింది ఇల్లు. తోటలో చెట్లన్నీ బిక్కు బిక్కుమంటూ వున్నాయి. నీలకాంతుని కుక్క మాత్రం హృదయం పగిలేటట్టుఅరుస్తూ తనవలెనే దిక్కు లేని తన యజమానికోసం అంతటా తిరుగుతూ వెదుక్కుంటోంది.

—)o(—

# చావా? బ్రతుకా?

శారదా శంకరు ఒక పెద్ద జమీందారు. వారిఇంట్లో ఉన్న వితంతువుకు చుట్ట పక్కాలు లేరు. ఆమె శారదా శంకరు బిడ్డను మాత్రం అతిగారాబంగా చూచేది. శారదా శంకరు భార్య జబ్బు మనిషి. ఆయన మేనత్త కాదంబిని బిడ్డని పెంచుతూ ఉండేది. ఒకరి బిడ్డను ఒకరు పెంచితే సర్వసామాన్యంగా అతిప్రేమతో చూస్తారు. ప్రేమ నిరూపించటానికి, ప్రేమ ఉన్నదని సంఘాన్ని ఒప్పించటానికి పత్రా లుండవు. ప్రేమను ఆరాధించటం తప్ప మరేమీ ఉండదు. అనుకోనట్లుగా ఒక రాత్రి కాదంబిని హఠాత్తుగా చనిపోయింది. కారణం తెలియదు. ప్రపంచంలో అనేక మంది, అనేకరకాలుగా చెప్పుకుంటూ ఉంటారు. ఆమెకు దహన సంస్కారాలు చేయుటకు జమీందారుగారి సేవకులు తీసుకొని వెళ్ళారు.

ఆ వూరుకు శ్మశానం చాలా దూరంగా ఉంటుంది. అచ్చట ఒక చెరువు. చెరువు ప్రక్క ఒక చిన్న గుడిసె, ఒక పెద్ద మఱ్ఱిచెట్టు ఉన్నవి. ఆ నలుగురు సేవకులు

శవాన్ని గుడిసెలోకిచేర్చారు. కట్టెలకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు. ఆ నలుగురిలో నిటాయ్, గురుచరణ్ అను వారు కట్టెలకోసం వెళ్ళారు. మిగిలినవారు బిధు, వన మాలి శవాన్ని కాపలా కాస్తున్నారు.

అమావాస్య చీకటి. వారు తెచ్చిన నిప్పు, లైటు ఆరిపోయాయి. నిప్పుపెట్టె తడిసిపోయినది. వెళ్ళినవారు తిరిగి రాలేదు. అందులో ఒకరు 'అన్నా, మన కిప్పుడు మంచి పొగాకు ఉన్నట్లయితే చాలా బాగుండేది. తొంద రలో మరిచిపోయివచ్చాం' అన్నాడు. 'నేను పరుగెత్తుకెళ్ళి మనకు కావలసిన సామగ్రి తెస్తాను', 'నీవు వెళ్ళితే నేను ఒంటరిగా ఉండొద్దా' అన్నాడు బిధు. సంభాషణ అంత టితో ముగిసింది. నిముషం ఒక గంటగా వారు కాలం గడుపుతున్నారు. కట్టెలకోసం వెళ్ళినవారిని మనస్సులో నిందిస్తున్నారు. అంతా చీకటిమయం. చెరువులో ఉన్న కప్పలశబ్దం మాత్రం వినబడుతోంది. కొంత సేపటికి హఠాత్తుగా ఆ శవము కదులుతున్నట్లు కనిపించింది. బిధు, వనమాలి భయకంపితులైనారు. భయంతో రామ మంత్రాన్ని జపిస్తున్నారు. కొంతసేపటికి ఆ గదిలో ఒక పెద్ద నిట్టూర్పు వినిపించింది. వారికి వణుకుపుట్టి అచ్చటి నుండి ఇంటి మార్గాన పరుగెత్తడం ప్రారంభించారు.

మూడుమైళ్ళు పరుగెత్తిన తర్వాత, వారు కట్టెల కోసం వెళ్ళిన వారిని కలుసుకొన్నారు. ఒక పెద్దచెట్టును పడగొట్టామని, దానిని పగుల కొట్టి వెంటనే తీసుకు రావచ్చుననీ చెప్పారు. విధు, వనమాలి గుడిసెలో జరిగిన వృత్తాంతము చెప్పారు. వెంటనే వా రంతా గుడిసెదగ్గరకు వచ్చారు. గుడిసెలోకి వెళ్ళి చూచారు. శవం లేదు. శవ పేటిక మాత్రం ఉన్నది. వారికి చాలాఆశ్చర్యం వేసింది. అంతా వెలవెలబోతూ అటూ ఇటూ చూచారు. ఆ గుడిసె వాకిలి ముందర ఉన్న మట్టిమీద స్త్రీ పాదముల గుర్తు చూచారు వారు. వివిధ విధాల ఆలోచించారు. చివరకు ఆ శవాన్ని దహనం చేశామని శారదా శంకరుతో చెప్పుటకు నిశ్చయించుకున్నారు.

౨

వెంటనే చనిపోయిన శవాన్ని పరీక్షిస్తే ఎక్కడనో ప్రాణం గుట గుట లాడుతూ ఉంటుంది. ఈ సంగతి సామాన్యంగా అందరికీ తెలుసు. కాదంబిని నిజముగా చనిపోవలేదు. ఏదో కారణము వలన ఆమె గుండె కొద్దిసేపు ఆగిపోయినది.

ఆమెకు తెలివి రాగానే, తమ మామూలు ప్రదేశంలో లేదని గ్రహించినది. 'అక్కా' అని పిలిచినది.

ఆ చీకటి గాఢాంధకారం నుంచి సమాధానం రాలేదు. భయంతో లేచి కూర్చున్నది. జరిగిన సంగతులు మనస్సులో వొకసారి గుర్తుకు తెచ్చుకున్నది. ఆమెకు గుండె నొప్పి రావటం, మూర్ఛపడి పోవటం, శవ పేటికను తయారు చేయటం ఈసంగతులన్నీ వొకసారి మనస్సులో పరుగెత్తినవి. ఆమె మూర్ఛతో పడిపోయినప్పుడు వదినె గారు బిడ్డకు పాలు వెచ్చ చేస్తున్నది. ఆఖరిసారిగా ఆబిడ్డ ముద్దు మాటలతో అత్తా అని పిలిచిన సంగతి జ్ఞాపకం తెచ్చుకోలేక పోయింది. ఆ ప్రదేశంలో ఉన్న చెరువు, పెద్ద మర్రిచెట్టు, మైదానం, దూరానవున్న చెట్లు చూస్తూ మనస్సులో ఆలోచించుకుంటున్నది. మొదట ఇంటికివెళ్ళ దామని అనుకొన్నది. కాని మరల ఆలోచించినది. 'నేను చనిపోయినాను- ఎలా ఇంటికి వెళ్ళటం- ఈ భౌతిక ప్రపంచాన్ని వదిలిపెట్టాను. ఈ సంగతులు నిజం కానియెడల నేను యిచ్చటకు ఎలావచ్చాను! దహన సంస్కారములు పూర్తి కానియెడల నన్ను తెచ్చిన మనుష్యులు తిరిగి ఎట్లా వెళ్ళగలరు? జమీందారుగారి యింటిలో అతి వైభవంగా ఉండేదాన్ని, ఈ అర్థరాత్రి స్మశానంలో ఎందు కున్నాను? నిజంగా తనకు ఈప్రపంచంతో సంబంధం లేదు. తను ఒక దయ్యం, ఒక భూతం, వొకఅపశకునం' అని ఆలో

చించుకున్నది. కాని తనకు అంతులేని స్వాతంత్ర్యము, బలం ఉన్నదని తెలుసుకున్నది. ఆమె యిష్ట ప్రకారం ఎచ్చటికైనా వెళ్ళవచ్చునని అనుకొన్నది. వెంటనే ఆ గుడిసెనుండి బయటకు పరుగెత్తి స్మశానంలో నిలబడ్డది. ఇప్పుడు ఆమెకు భయం గాని, సంకోచము గాని లేదు.

కాలినడక ప్రారంభించినది. నడచి,నడచి అలసట చెందినది. పాదములు నొప్పిగా ఉంటున్నాయి. ఆమైదానం అంతులేకుండా ఉంది. అచ్చటచ్చట మాగాణి భూములు కనిపించు చున్నవి. తెల్లవారుఝామున పక్షుల కిలకిలా రావములు వినిపించుచున్నవి. అప్పుడు ఆమెకు భయం వేసింది. ఈ ప్రపంచంలో ఆమెకు ఎట్టి సంబంధంకలదో చెప్పలేని స్థితిలో ఉంది. బాగా తెల్లవారేటప్పటికే, యిళ్ళు వాకిళ్ళు, మనుష్యులు కనిపించారు.

ఆమె ధరించిన గుడ్డలన్నీ మట్టికొట్టుకొని వున్నవి. ఆ రాత్రి ఒంటరిగా నడచుట వలన అమె మనస్సులో పిచ్చి పిచ్చి ఆలోచనలు కలిగినవి. ఆమె ఆకారం చూస్తే మనుష్యులు భయపడి పారిపోతారు. పిల్లలు రాళ్ళు రువ్వి పరుగెత్తుకు పోతారనిపిస్తోంది. అదృష్టవశాత్తు వొక బాట సారి 'అమ్మా! మీరు చూడబోతే గౌరవనీయ కుటుంబ

మునకు చెందినవారివలె కన్పిస్తున్నారు. మీరు ఒంటరిగా ఎక్కడకు ప్రయాణము చేయుచున్నా' రని అడిగాడు.

కాదంబిని మాటాడలేదు. కన్ను ఆర్పకుండా ఆ బాటసారివంక తేరిపారజూచింది. ఆమె ఈ ప్రపంచంలో ఉన్నదని, గౌరవమైన స్త్రీవలె ఉన్నదని, బాటసారి తన్ను ప్రశ్నించుచున్నా డని ఆమె మరిచిపోయింది. 'అమ్మా మీరు ఎచ్చటికి వెళ్ళవలయునో చెప్పండి - నేను దారి చెపుతాను' అన్నాడు మరల బాటసారి.

కాదంబిని ఆలోచించింది. మామగారి యింటికి వెళ్ళటం మంచిదికాదు. పుట్టిల్లు లేదు. మరి ఎచ్చటకు వెళ్ళటం? ఆలోచించగా ఆమెస్నేహితురాలిఇల్లు జ్ఞాపకం వచ్చింది. ఆమెను జూచి చాలా కాలమయింది. వొకరి క్షేమం వొకరుఉత్తరాలద్వారా తెలుసుకుంటూ ఉండేవారు. వాళ్ళిద్దరూ చిన్ననాటినుండి ప్రాణస్నేహితులు.

'నందపూరులో ఉన్న శ్రీపతిగా రింటికి వెళ్ళాలి' అని బాటసారితో చెప్పింది. ఆ బాటసారి కలకత్తా వెళ్ళు చున్నాడు. నందపూరు తనువెళ్ళేదారిలో ఉన్నది. ఆమెను వెంట తీసుకొని శ్రీపతియింటికి తీసుకొని వెళ్ళాడు. స్నేహితులిద్దరూ మొదట్లో గుర్తించలేదు. వారి చిన్న నాటి సంగతులు గుర్తుకు తెచ్చుకున్నారు. వొకరి నొకరు

గుర్తుపట్టారు. స్నేహితురాలిపేరు మాయాదేవి. 'ఈరోజు చాల సుదినం. నేను మరల నిన్ను చూస్తానని కలలోనైనా అనుకోలేదు. మీ మామగారి మనుష్యులు నిన్ను ఎచ్చటకూ పోనివ్వరే? నీవు ఇక్కడకు ఎలా రాగలిగావు అక్కా!' అని అడిగింది. 'చెల్లీ! మామగారి సంగతి గూర్చి నన్ను అడుగవద్దు. నేను నీకు అంతపనీ చేస్తాను. నాకు తల దాచుకోటానికి చోటు యిస్తే చాలు' అన్నది.

'ఏమిటి! నిన్ను దాసిగా చూడమంటావా? ఎంత మాట!..నీవు నాకు చాలా ముఖ్య స్నేహితురాలవు' అంది మాయాదేవి. అదే సమయంలో శ్రీపతి వచ్చాడు. కాదంబిని అతనివంక జూచి మెల్లగా అచ్చటినుండి వెళ్ళినది. ఆమె మర్యాదగా, గౌరవంగా తన భర్తయెడల ప్రవర్తించలేదని మాయాదేవి తెలుసుకున్నది. భర్తకు కోపం రాకుండా జరిగిన సంగతులు చెప్పటం ప్రారంభించింది. శ్రీపతి మామూలుగానే ఉన్నాడు.

కాదంబిని స్నేహితురాలివద్దకు వచ్చినది గాని, ఆమెతో సన్నిహితంగా, సరదాగా మెలగటానికి ఆమె మనస్సు ఒప్పుకొనుట లేదు. తన మనస్సులో పరి పరి విధాల ఆలోచించటం ప్రారంభించింది. 'ఆమెకు భర్త ఉన్నాడు. ఆమె పనిలో నిమగ్నురాలై ఉంటుంది. ఆమె,

నేను ఉండే ప్రపంచానికి చాల దూరంగా ఉంది. నాకు ఈ ప్రపంచంతో సంబంధం లేదు. నే నొక నీడను. నాలో జీవం లేదు. నేను పరలోకంలో వున్నాను. అమె యీ లోకంలో ఉన్నది.'

మాయాదేవికూడా అదొక తరహాగా ఉంటున్నది. కారణం తెలియదు. రోజు రోజుకు వారిద్దరిమధ్యా ఎడ బాటు ఎక్కువవుతున్నది. కాదంబిని తననీడను చూచు కొని భయపడుతూ వుంటుంది. దయ్యాలంటే భయపడే వారు, వారి వెనకాల ఉన్నవారిని దయ్యా లనుకుంటారు. కాదంబిని భయం ఆమెలోనే ఉంది.

అర్ధరాత్రి ఆమె వొంటరిగా గదిలో ఉన్నప్పుడు పెద్దగా కలవరించినది. ఒకరోజు సాయంత్రము దీపం ఎదుట తన నీడను చూచుకొని భయకంపితురాలైనది. ఇదంతా ఇంటిలో ఉన్నవారుచూచి భయపడ్డారు. ఆరోజు నుంచీ మాయాదేవి పరిచారకులకు దయ్యాలు కనబడు తున్నాయి.

ఒకరోజు అర్ధరాత్రి కాదంబిని తన గదినుంచి వెక్కి వెక్కి ఏడుస్తూ మాయాదేవి గదివద్దకు వచ్చింది. 'అక్కా! అక్కా! నీకాళ్ళవద్ద ఉండాలి' అని ఏడవటం మొదలు పెట్టింది. ఈ సంగతి చూచేటప్పటికి మాయా

దేవికి అపరిమితమైనభయం, కోపంవచ్చినవి. కాదంబినిని వెంటనే యింటికి తరిమివేయాలని అనుకున్నది. కాని శ్రీపతి ఓర్పుతో! కాదంబినిని ఓదార్చి. దయార్ద్ర హృదయంతో ధైర్యంచెప్పి ఆమెగదికి పంపించాడు.

మరుసటిరోజు మాయాదేవి తన భర్తను వెంటనే రమ్మనమని కబురుచేసింది. శ్రీపతి వచ్చాడు. 'ఏమండీ! మీరు చేసే పనిలో అర్థమున్నదా ? వొక స్త్రీ మామగారి యింటినుండి పారిపోయి, మన యింటికి వచ్చింది. ఒక నెల గడిచింది. ఆమెను వెళ్ళమని మాటమాత్రం గూడా చెప్పరు, ఇదేమి కర్మమండీ' అని భర్తను మందలించినది. మాయాదేవిని ఓపిక పట్టమన్నాడు. మగవారు ఆడవారి మాదిరిగా తొందరపడరన్నాడు. ప్రతివిషయం నిదానంగా ఆలోచించాలన్నాడు. కాదంబిని మామగారి యింటివద్ద యమబాధలు పడి పారిపోయి వచ్చినది. ఆమెకు తల్లిదండ్రులు లేరు. 'నా' అన్నవారు ఎవ్వరూ లేరు. ఈ పరిస్థితులలో ఆమెను బాధ పెట్టుట ధర్మం కాదని చెప్పాడు. కాని మాయాదేవి భర్తను వేధించటం మొదలుపెట్టింది. శ్రీపతి కాదంబిని మామగారి యింటికి వెళ్ళుటకు నిశ్చయించుకున్నారు. ఈ సంగతి మాయాదేవితో చెప్పి వెళ్ళాడు.

'అక్కా, నీవు యిచ్చట చాలా కాలం ఉండుట మంచిదికాదు. ప్రజ అంతా ఏమనుకుంటారు?' అన్నది మాయాదేవి.

'ప్రజలతో నా కేమిపని?' అని గట్టిగా చెప్పినది కాదంబిని. ఈ మాటలకు మాయాదేవికి చాలా కోపం వచ్చింది. 'నీకు పనిలేకపోతే-మాకు ఉంటుంది. పరాయి స్త్రీని మా యింటిలో ఇంతకాలంఉంచుటకు మేము సంజాయిషీ చెప్పాలి.'

'నా మామగారియిల్లు ఎక్కడ? నీతో నాకేమిపని? నాకు ఈ ప్రపంచంతో సంబంధంలేదు. నీవు నవ్వుతావు, ఏడుస్తావు, ప్రేమిస్తావు - నీవు మనిషివి, నేను దేవుడను. నన్ను దేవుడు ఈ లోకంలో ఎందుకు ఉంచాడో నా కర్థం కావటంలేదు.'

కాదంబిని చెప్పు మాటలు మాయాదేవికి చాలా విచిత్రంగా ఉన్నవి. ఆమె ఏదో చెప్పలాని బాధ పడుచున్నదని తెలుసుకొన్నది. ఆమెకు ఏమి చెప్పాలో తోచక, ప్రశ్నించుటకు యిష్టంలేక అచ్చటినుండి వెళ్ళినది.

రాత్రి పదిగంటలకు శ్రీపతి కాదంబిని మామగారి యింటివద్దనుండి తిరిగివచ్చాడు. పెద్దపెట్టున వర్షం కురుస్తున్నది. చాలా సంగతులు చెప్పాలంటూ, తడిసిన

గుడ్డలు విప్పేసి, మంచిగుడ్డలు ధరించి భోజనమునకు కూర్చున్నాడు. భోజనం అయిన తరువాత చుట్టత్రాగుతూ కుర్చీలో కూర్చున్నాడు. పని పూర్తిచేసుకొని మాయాదేవి సంగతులు తెలుసుకోవాలనే ఆదుర్దాతో భర్త వద్దకు వచ్చింది.

'నీవు చాలా తప్పుచేశావు' అన్నాడు భర్త.

మాయాదేవికి అర్థం కాలేదు. 'సామాన్యంగా ఆడవారు తప్పులు చేయరు. ఒకవేళ పొరపాటున జేస్తే, తెలివిగల మగవారు వాటిని బయటపెట్టరు. నేను ఏమి తప్పు చేశానో, ఎలా చేశానో చెప్పండి?' అంది.

'మన యింటిలో ఉన్న మనిషి నీ స్నేహితురాలు కాదంబిని కాదు.'

'ఏమి మాటలండీ! నేనంత తెలివితక్కువదాన్నా? నా స్నేహితురాలిని గుర్తుపట్టలేనా? మీరు కూడా చూచి కాదంబిని అన్నారు.'

'ఈవిషయంలో మనిద్దరం తగాదా పడటం అనవసరం. కాదంబిని చనిపోయింది! అది నిజం.'

'మీరేదో పొరపడ్డారు. ఉత్తరం వ్రాయండి. అసలుసంగతి తెలుస్తుంది.'

ఈ విషయాన్ని గురించి భార్యా భర్త లిద్దరూ తగాదా పడుతున్నారు. పెద్దపెద్దగా అరుచుకుకుంటున్నారు.

కాదంబిని ప్రక్క గదిలో నిద్రపోతున్న సంగతి మరచిపోయినారు. కాదంబినిని యింటినుండి పంపటానికి నిశ్చయించుకున్నారు. రాత్రి వొంటిగంటయింది. దీపం ఆరిపోయినది. వర్షము కురుస్తూనే ఉన్నది. కాదంబిని అచ్చటికి వచ్చి నిలబడి, 'స్నేహితులారా! నేను నిజంగా కాదంబినిని. అయితే నేను చనిపోయినాను. నేను నీకేమీ కీడు తలంపలేదు. నేను మీతో నివసించటానికి వీలులేకపోతే, చనిపోయిన వారిలో ఉండుటకు అంతకన్నా వీలులేదు. నాకు దిక్కెవరు? ఎక్కడికి వెళ్ళేది? ఏమి చేసేది? నా దారి నే చూచుకుంటా,' నంటూ ఆ చీకటి గాఢాంధకారములో వెళ్ళినది.

౨

కాదంబిని మామగారి ఊరు ఎలా చేరిందో తెలియదు. తిండి లేకుండా మల మలా మాడుతూ వొక పాడు పడిన దేవాలయములో పగలల్లా గడిపింది. చీకటిపడిన తరువాత కాదంబిని మామగారింటికి వచ్చినది. గుండె దడదడా కొట్టుకుంటున్నది. ముసుగు వేసుకుని ఇంటిలో ప్రవేశించింది. అచ్చటనున్న పరిచారకులెవ్వరూ ఆమెను ఆటకాయించలేదు. వారంతా ఆమెకూడా వొక పనికత్తె అనుకున్నారు.

గాలి భయంకరంగా వీస్తున్నది. ఉరుములు మెరుపులతో వర్షం బ్రహ్మాండముగా కురుస్తున్నది. శారదా శంకరు భార్య ఆమె విధవ అక్కగారితో చదరంగం ఆడుకుంటున్నది. జబ్బుగా ఉన్న బిడ్డ, ప్రక్క గదిలో నిద్రపోతున్నాడు. వంటయింటిలో పనిమనిషి చాకిరి చేస్తున్నది. కాదంబిని వీళ్ళందరిని మెల్లిగా తప్పించుకొని బిడ్డ ఉన్న గదిలోకి వచ్చినది. ఆమె యిక్కడకు ఎందుకు వచ్చినదో ఆమెకే తెలియదు. ఎక్కడకు వెళ్ళవలయునో ఏమి చేయవలయునో ఆమెకు తోచలేదు. నిద్రపోతున్న బిడ్డను చూచింది. బిడ్డ జ్వరంతో బాధ పడుతున్నట్లు గ్రహించింది. ఆ దృశ్యము ఆమె హృదయానికి చాలా బాధ కలిగించింది. ఆ బిడ్డను హృదయానికి హత్తుకుంటూ, 'నే ప్రేమించినట్లు ఎవరు ప్రేమిస్తారు? ఆ కన్నతల్లి ఎప్పుడూ కబుర్లు చెప్పుకుంటూ, ఆడుకుంటూ, కాలం వ్యర్థం చేస్తున్నది' అనుకున్నది.

ఆ బిడ్డ కళ్లుతెరచి 'అత్తా, నీరు కావాలి' అన్నది. బిడ్డకు నీరు ఇచ్చినది. ఎప్పుడైతే కాదంబిని నీరు పోసి, ముద్దు పెట్టుకున్నదో, ఆ బిడ్డ ఆమెను గట్టిగా కౌగలించుకున్నది. 'నీవు చనిపోయినావా, అత్తా!' అని అడిగింది.

'ఔను, నాయనా.'

'తిరిగి ఎలావచ్చావు!- మరల చనిపోవద్దు అత్తా!' అన్నది బిడ్డ. కాదంబిని సమాధానం చెప్పేలోపల వొక పనికత్తె కప్పుతో పాలు తీసుకొని ఆ గదిలోకి వచ్చినది. కాదంబినిని చూచేటప్పటికి కప్పును జారవిడుస్తూ, పెద్ద కేకవేస్తూ పడిపోయింది. ఈ గందరగోళానికి శారదా శంకరు భార్య గబ గబా పరుగెత్తుకొనివచ్చి, కాదంబినిని చూచి నిశ్చేష్టురాలైంది. బిడ్డ ఈ సంగతంతా గ్రహించి 'వెళ్ళిపో అత్తా' అంది.

తను చనిపోలేదని కాదంబిని యిప్పుడు తెలుసు కున్నది. 'ఎందు కలా నిలబడ్డావు, నేను నీకు తెలియదా?' అని ప్రశ్నించింది. ఇంతలోకే శారదా శంకరు అచ్చటికి వచ్చాడు.

చేతులు జోడించి, 'ఇది న్యాయమా? నాకు ఒకే బిడ్డగదా! నీవు మరల ఎందుకు కన్పించినావు? నీవువెళ్ళిన తర్వాత పాపసంగతి చాలా చెడిపోయినది. ఎప్పుడూ అత్తా, అత్తా అని పలవరిస్తాడు. మమ్మలను రక్షించు. నీవు ఈ ప్రపంచాన్ని వదిలి వెళ్ళినావు. నీకు చేయవల సిన కర్మలన్నీ చేస్తాను.'

కాదంబిని యిక సహించలేక పోయింది. 'నేను చనిపోలేదు! చనిపోలేదు!! ఈ సంగతి మిమ్మలను

ఎలా నమ్మించేది ? నే బ్రతికే ఉన్నాను. నాలో ప్రాణం ఉంది. జీవించే ఉన్నాను' అచ్చట ఉన్న ఒక యిత్తడి పాత్ర తీసుకొని నెత్తిమీద గట్టిగా కొట్టుకొన్నది. తల పగిలి, నెత్తురు కారుతున్నది. 'ఇప్పుడైనా నమ్ముతావా ? నే బ్రతికే వున్నానని' అంటూ తోట్లో వున్న బావిలో దూకింది.

— ... —

## భక్తురాలు

నా ప్రతిష్ఠ నాశనమైనది. నన్ను గూర్చి పత్రికలలో నిత్యమూ దూషించుట ప్రారంభించినారు. ఈ దూషణ భరించలేక పోయినాను. ఏదైనా పురాతనమైన స్థలములో ఉండి, నన్ను గూర్చి మరచిపోవుటకు ప్రయత్నం చేయుట మంచిదని నిశ్చయించుకున్నాను.

కలకత్తాకు కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న గ్రామంలో నా కొక ఇల్లున్నది. అచ్చట ఎవ్వరికీ తెలియకుండాను, ఏ ఉపద్రవము లేకుండాను ఉండవచ్చును. ఆ పల్లెటూరి లోని ప్రజలు నన్ను గూర్చి ఇంతవరకు ఏవిధమైన అభి ప్రాయమునకు రాలేదు. నేను వారికి ఒక ప్రయాణీకు డుగా కాని, సెలవులలో హాయిగా కాలం గడుపుటకు వచ్చిన వాణ్ణిగా కాని కన్పించలేదు. వారు నన్ను సన్యా సిగా పరిగణించలేదు. నేను స్వభావసిద్ధంగా సోమరిని. ఆ పల్లెటూరిలోని పొలాలలో ఏ ఆశయం లేకుండా తిరుగుతుంటాను. నాకు వివాహమయిందో లేదో వారికి నమ్మకంగా తెలియదు. నన్ను ఏ తరగతి జనాభాలో

జేర్చాలో తెలియక, సన్నొక మొద్దబ్బాయిగా పరిగణించి వదిలివేశారు.

అయితే తరువాత ఆడుకోళ్ళ ఒక వ్యక్తి నామీద మిక్కిలి అభిమానంగాఉన్నాడని తెలుసుకున్నాను. జులై మాసంలో ఒకరోజు సాయంత్రము వానితో పరిచయం లభించింది. ఉదయమంతా వర్షము కురుస్తూనే ఉన్నది. మంచుగాలి వీస్తున్నది. నది ఒడ్డున ఒక ఆవు మేస్తుంటే దానిని చూస్తూ ఆలోచించుకుంటూ కూర్చున్నాను. ఆ సమయములో నడివయస్సులో ఉన్న స్త్రీ వచ్చి ప్రణామం చేసింది. రెండు చేతులతో నమస్కారముచేస్తూ, ఆమె వడిలోని పుష్పాన్ని నా కిచ్చింది. 'ఇది నా దేవునికి బహుమతి' అని చెప్పి వెళ్ళిపోయింది. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఆమెను సరిగా తెలుసుకోక మునుపే ఆమె వెళ్ళింది. ఇదంతా చూచుటకు చిన్నసంఘటనగా ఉంటుంది. ఇది నా మనస్సులో గట్టిగా నాటుకుంది. నేను పొలాల్లో మేసే పశువుల మంద దగ్గరకు వెళ్ళాను. అందులో ఒక ఆవు పచ్చిమేతను కొరుకుతూ నములుతూ, ఈగలను తోలుకుంటూ ఉంది. ప్రకృతి సిద్ధమైన ప్రశాంతమయిన సుఖజీవితం గడుపుట దేవునియొక్క జీవితము. అట్టి జీవితానికే మనము ప్రార్థించాలి. ప్రక్కనే ఉన్న మామిడి

చెట్టు ఆకుతెచ్చి త్రుంచి ఆవుకు పెట్టాను. నేను అనుకున్న దేవుణ్ని సంతోషపెట్టానని నాకు తృప్తి.

మరుసటి సంవత్సరము ఫిబ్రవరిమాసములో మా ఊరు వెళ్ళాను. చలికాలం ఇంకా పోలేదు. ఉదయభానుడు నా గదిలోకివచ్చి నాకుకొంత హాయిని కలుగజేశాడు. నేను వ్రాసుకొంటున్నాను. ఇంతలోకే సేవకుడువచ్చి, 'అయ్యా! మీకోసం ఒక భక్తురాలు వచ్చింది' అని చెప్పాడు. నేను వినిపించుకోనట్లుగా 'మేడపైకి తీసుకురమ్మన'మని చెప్పి వ్రాసుకొంటున్నాను. ఆ భక్తురాలు వచ్చి, నా పాదములకు నమస్కారము చేసింది. ఆమె ఒక సంవత్సరము క్రితము నావద్దకు వచ్చిన స్త్రీ అని గుర్తుపట్టాను. ఆమెను పరికించి చూచాను. ఆమె అందమైనదా లేదా అనే ప్రశ్న అడగ నవసరము లేని వయస్సులో ఉన్నది. ఆమె మామూలు కన్నా ఎత్తుగా ఉంది. శరీరం దార్ఢ్యంగాఉంది. ఆమెలో ముఖ్యంగా చూడ తగినవి ఆమె రెండు నేత్రములు. ఆ నేత్రాలకు చొచ్చుకుపోయే శక్తి ఉన్నట్లు కనిపించింది. ఆమె ఆ నేత్రాలతో చూస్తూ, 'ఇదేమిటి? నన్నెందు కిక్కడకు రప్పించారు - దేవుడా? నేను మిమ్ములను చెట్లలో తిరుగుతుంటే చూచేదాన్ని. అదే బాగుంది. అదే మిమ్ములను కలుసుకొనుటకు ముఖ్యమైన స్థలము' అన్నది.

బహుశా నేను తోటలలో తిరుగుతూ ఉంటే ఆమె చూచి ఉంటుంది. కొన్ని రోజులనుంచి జబ్బు భారంగా ఉంటూన నేను బయటకు వెళ్లటలేదు. కొంతసే పయిన తరువాత ఆ భక్తురాలు 'ఓ భగవాన్, మంచి మాటలు చెప్పండి' అంది. ఆమె కోరిన కోర్కెను నెరవేర్చు టకు నేను సిద్ధంగాలేను. కాని సమాధానంమాత్రం వెంటనే చెప్పాను. 'మంచిమాటలు నేను చెప్పను, వినను. నా నేత్రములు మాత్రము తెరుస్తాను. మౌనంగా ఉంటాను. అప్పుడు నేను వినగలను, చూడగలను. ఇప్పుడు నీవంక చూస్తున్నానంటే, నీవు మాట్లాడే మాటలను వింటున్నాను.'

నేను మాట్లాడిన మాటలకు ఆ భక్తురాలు ఆవేశం పట్టలేక, 'దేవుడు నాతో మాట్లాడుతున్నాడు. నోటితో కాదు; హృదయ మంతటితోను' అన్నది.

'నేను మౌనంగా ఉన్నప్పుడు నాహృదయ మంతటి తోను వినగలను. నేను కలకత్తానుంచి ఆ శబ్దాన్ని విను టకు ఇచ్చటకు వచ్చాను' అన్నాను. 'అవును. అది నాకు తెలుసు. అందువలననే నేనువచ్చి నీ ముందర కూర్చు న్నాను' అంది భక్తురాలు. ఆమె నావద్ద సెలవు తీసుకొనే ముందు, నాకు నమస్కరించి, నా పాదాలను తాకింది. అది ఆమెకు కష్టంగా తోచిందని నాకు తెలుసు. ఎందు

వల్లనంటే నాపాదాలు కప్పబడి ఉన్నాయి. దిగంబరంగా ఉంటే బాగుండేదని ఆమె అనుకున్నది.

మరుసటిరోజు ఉదయం నేను డాబామీద కూర్చున్నాను. దక్షిణంగా ఉన్న చెట్ల పంక్తి అవతల విశాల మైదానము, పొలాలు చూస్తున్నాను. ఆ చెట్ల సందులలో నుంచి ఊరి రోడ్డు కనిపించింది. ఆరోజుదయం సూర్యుడు ఉదయించినది - లేనిది చెప్పుట కష్టంగాఉంది. చెట్లపైన మంచు బాగా ఉన్నది. ఆ సమయంలో ఆపొగ మంచులో భక్తురాలు నడుస్తూపోతున్నది. దేవునిమీద పాటలు పాడుకుంటూ రెండు చేతులతోను భజన చేసుకుంటూ వెళ్ళుతున్నది. కొంతసేపటికి ఆ పొగమంచు తగ్గిపోయినది. సూర్యుడు మునలితాతవలె పైకివచ్చి ప్రకాశిస్తున్నాడు. కలకత్తాలో ఉన్న సంపాదకునకు వ్యాసము వ్రాస్తూ కూర్చున్నాను. అప్పుడు ఆభక్తురాలు పాటపాడుకుంటూ నావద్దకు వచ్చి నమస్కారము చేసింది. నేను తలెత్తి చూచాను.

'నా దేవుడా, నిన్నటిరోజున మీరు భుజించి వదిలి వేసిన పవిత్రమయిన ఆహారాన్ని తీసుకున్నాను' అంది.

నాకు మితి మీరిన ఆశ్చర్యం వేసింది. 'మీరు ఆ పని ఎలా చేయగలిగార'ని అడిగాను.

'నిన్న సాయంత్రము మీ తలుపు దగ్గరే కాపలా ఉన్నాను. మీరు భోజనం చేసినతరువాత, కంచంలో మిగిలిన ఆహారము నేను తీసుకొన్నాను' అంది.

నేను ఆశ్చర్యపడుట చూచి, 'నా దేవుడా, నేను మీ ఆహారాన్ని తీసుకొనలేకపోతే, అసలు మీవద్దకు నేను ఎందుకు రావాల్సి వచ్చేది ?'

మీ కులానికి చెందిన వా రేమంటారని అడిగాను. ఈ సంగతంతా అందరికి చెప్పానని, వాళ్ళు తలకాయ లూపి, నా త్రోవనే పోవుటకు అంగీకరించారని చెప్పింది. ఆ భక్తురాలు గౌరవనీయమైన కుటుంబానికి చెందినదని, ఆమెతల్లి భాగ్యవంతురాలని, కూతురును తనవద్దనే ఉండ మని చెప్పినదని, అది తనకు ఇష్టము లేక సన్యాసిగా ఉండాలనుకొన్నదని తెలుసుకున్నాను.

'ఎలా నివసిస్తున్నా' రని అడిగాను. తనను అను సరించే వారు తనకు కొద్దిగా స్థలము ఇచ్చారని, ఇంటిం టికి వెళ్ళి ఆహారంకోసం భిక్ష మెత్తుతానని, అట్లా భిక్ష మెత్తుకుంటూ వచ్చిన ఆహారము ఈశ్వరతుల్య మయిన దని, చెప్పింది.

ఆమె చెప్పిన మాటలోని అర్థాన్ని గ్రహించాను. మనము ఆహారము భిక్షాటనముగా సంపాదించుకుంటే, దేవుణ్ణి జ్ఞాపకము పెట్టుకొంటాము. అయితే మనకు ఇంటి దగ్గర ఆహారము ఉచితంగా వస్తుంటే, అది మన శక్తి సామర్థ్యాల వలననే అనుకుంటాము. ఆమె భర్తనుగూర్చి

అడగాలని తహ తహ లాడుతున్నాను. కాని ఆమె సూచనగా నైనా ఆ విషయాన్ని ప్రస్తావించలేదు. అందువలన ఆమెను ప్రశ్నించలేదు. ఆ ఊళ్ళో ఉన్న అగ్రకులాల వారిని చూస్తే ఆమెకు ఇష్టం లేదని నేను గ్రహించాను. అగ్రకులాల వారు ఈశ్వరసేవ నిమిత్తం ఒక్కదమ్మిడీ కూడా ఖర్చు పెట్టరని, అయితే భోగభాగ్యాలతో వారే తులతూగుతుంటారని, పేదవారుమాత్రం దేవుని ప్రార్థిస్తూ మల మల మాడిపోతుంటారని చెప్పింది. అయితే ఆ నాస్తికులవద్దకు వెళ్ళి వాళ్ళను మంచిమార్గములో పెట్టుటకు ఎందుకు సహాయపడకూడ దని అడిగాను. అంతకన్నా ఈశ్వర సేవ మరొకటి లేదని చెప్పాను. నా మాటలు అమెకు నచ్చినట్లు లేదు. ఆమె తన రెండు నేత్రాలతో నావంక చూస్తూ 'దేవుడు పాపుల దగ్గర ఉంటాడు. గనుక పాపులకు సేవచేస్తే, దేవునికి సేవచేసినట్లే నని మీ అభిప్రాయమా ?' అని అడిగింది.

'ఔను, అదే నాఅర్థము' అన్నాను. 'ఔను దేవుడు వాళ్ళ వద్దనే ఉన్నాడు. లేకపోతే వాళ్ళు ఎలా నివసించగల్గుతున్నారు ? అది నాకేమిటి? నాదేవుడు అచ్చటలేడు. నా దేవుడు వాళ్ళల్లో పూజింపబడడు. నాదేవుడు వాళ్ళవద్ద కనుపించడు. దేవుణ్ణి ఎక్కడైతే చూడగల్గుతానో అచ్చట

ఉండాలి.' ఓర్మి లేకుండా అంది. అంతే, దేవుడు సర్వాంతర్యామి, అన్నిచోట్లా ఉంటాడు. అందువలన ప్రయోజనము లేదు. ఇది సత్యము ఈ సత్యాన్ని వేరు చేయలేము. స్పృశించ లేము. అందువలననే అదంతా మనకు అనిత్యంగా కనపడుతుంది. మన హృదయంలోనే ఉన్నాడు దేవుడు. మనము అక్కడ చూడగలం. ఇదంతా చెపుతుంటే అమిత భక్తి శ్రద్ధలతో వింటున్నది. నన్నొక దేవుని రథముగా భావిస్తున్నది. నేను దాన్ని కాదనలేదు. తోసివేయలేదు. అది నాది కాదు. అదంతా దేవునిదే,

పుస్తకములు చదువుకొనుటలో నిమగ్నుడనైనాను. మరల భక్తురాలు వచ్చింది.

'ఏం జేస్తున్నారు మీరు? మిక్కిలి కష్టమైన పని నా దేవుడు చేయుచున్నాడా?' విసుగుతో అడిగింది. 'ఎప్పు డొచ్చినా మీరు చదువుటో, వ్రాయుటో చేస్తూ ఉంటారు' అంది.

'దేవుడు పనికిరాని మనుష్యులను విశ్రాంతిలేకుండా ఉంచుతాడు' అని సమాధానము చెప్పాను. అలా లేకపోతే వాళ్ళు తప్పుడు పనులు చేస్తారు. జీవితాని కవసరమైన వస్తువులన్నీ చూచుకోవాలి. అది వారిని కష్టాలను డి రక్షిస్తుంది.'

భక్తురాలు నన్ను చూడా లనుకుంటే సేవకులు ఆమెను నా మేడమీదకు రానివ్వరు. నా పాదాలను పూజించా లంటే నా పాదాలు ఎప్పుడూ చిన్న మేజోళ్ళతో నిండి ఉంటాయి. నాతో సంభాషించా లంటే నే నెప్పుడూ వ్రాత లోనో, చదువులోనో నిమగ్నుడనయి వుంటాను. ఆమె కిదంతా కష్టంగా ఉన్నదని చెప్పింది.

ఈసారి ఆమె వెళ్ళేముందర ఆమె రెండు చేతులు జోడించి, 'నా దేవుడా! ఈ ఉదయం మీ పాదాలను నా హృదయానికి హత్తుకున్నాను. అబ్బా! ఎంత చల్లగా ఉన్నాయి. అవి కప్పబడిలేవు. వాటిని నా తలమీద పెట్టు కొని పూజించాను. పూజించి తరువాత మీ వద్దకు వచ్చుట వలన ప్రయోజన మేమిటి? నే నెందుకు రావాలి? నిజం చెప్పండి. ఇది నా బుద్ధిహీనత కాదా?' అంది.

నా బల్లమీద ఉన్న పాత్రలో కొన్ని పుష్పాలు న్నాయి. ఆమె అచ్చట ఉండగానే తోటమాలి మరికొన్ని పుష్పాలు తెచ్చాడు. ఆ భక్తురాలు చూచింది.

'అంతేనా? పుష్పాలతో పనైనదా? అయితే నా కివ్వు' అంటూ తన చేతిలో పువ్వులుపోసుకొని వాటివంక తదేక ధ్యానంతో చూచింది. కొన్ని నిమిషాలు గడచిన తరువాత, 'మీరు పుష్పాలను చూడరేమిటి? బహుశా

అవి మీకు వాడినట్లుగా ఉన్నాయనుకుంటాను. మీరు వాటి వంక పరికించి చూచినట్లయితే మీ చదువు, వ్రాత గాలికి పోతాయి.'

ఆ పుష్పాలన్నీ ఆమె కొంగుచివర కట్టుకొని, దానిని తలమీద పెట్టుకొని భక్తితో నావెంట 'నా దేవుణ్ణి తీసుకు వెళ్ళుతాను' అంటూ వెళ్ళింది.

మరల సాయంత్రము ఆ భక్తురాలు వచ్చి నావద్ద కూచున్నది. 'ఆ పుష్పాలన్నీ యిల్లు యిల్లూ తిరుగుతూ దేవుని పాటపాడుకుంటూ అందరికీ ఇచ్చేశాను. మనఊరి పెద్దాయన 'విని' నన్ను చూచి నవ్వుతూ, 'ఎందు కలా దేవునిమీద కాలం వృధా చేస్తావు? దేవుడు ఈ వూరంతే దూషించుతాడు' అన్నాడు.

భక్తురాలు చెప్పింది. 'భక్తిని ఒక క్షణంలో తృణీకరించవచ్చునని విని ఊహించాడు. భక్తి ఒక చిన్నదీపం కాదు. అది ఎప్పుడూ మండుతూనే ఉంటుంది. మిమ్మ్ములను ఎందుకు దూషిస్తారు. నా దేవుడా?'

నేను దానికి తగినవాణ్ణి. అందుకే వారు నన్ను దూషిస్తారు. ఆశతోను, లాభంతోను చాటుగా ప్రజల హృదయాలను దొంగిలించుతా నని అనుకొంటారు.'

'వారి హృదయాలు ఎంత చిన్నవో మీ కిప్పు డర్థ మయిం దనుకుంటాను. వారి హృదయాలు విషతుల్యము. ఇవి మీ ఆశను పోగొట్టుతాయి.'

మానవుని హృదయం ఆశతో కూడుకున్నదయితే అత డెప్పుడూ పతన మవుతాడు. లోభమనేది విషమనే శత్రువులను కలుగజేస్తుంది.'

'ఎంత దయార్ద్ర దేవుడండీ మీరు! దేవునియొక్క కష్టనష్టాలను భరించేవారు రక్షింపబడతారు' అంది భక్తురాలు.

౨

ఆ సాంత్రము భక్తురాలు తన జీవిత చరిత్రను గూర్చి చెప్పింది.

నా భర్త సామాన్యుడు. కొంతమంది వారిని అమాయకుడుగా భావిస్తారు. వారి అవసరాలు చాలా పరిమితంగా వుంటాయి. వారికి పెద్ద కోర్కెలు లేవు. ఉన్న దానితో సర్దుకుపోగల సామర్థ్యమున్నది. వ్యాపార, ఇంటి వ్యవహారాల్లో వారిష్ట మొచ్చినట్లే చేసుకుంటారు. ఇతరుల జోక్యాన్ని వారు పట్టించుకోరు. వారి తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోయినారు. నేనంటే భక్తి గౌరవాలతో చూస్తారు. వారికన్నా గొప్పదాన్నిగా భావిస్తారు. ఇది నాకు

సిగ్గుగా వుంటుంది' యదార్థంగా నాకన్నా వారేగొప్పవారు. వారు బాగా మాట్లాడగలరు.

గురు టాకూరు అంటే వారికి చాలా గౌరవము. వారిని అమిత ప్రేమగా చూసేవారు. గురు టాకూరు నా భర్తగారికన్నా చిన్నవారు. చాలా అందమైనవారు. వారు చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడు నాభర్త వారితో ఆటలాడు కొనేవారు. నా భర్త హృదయం సున్నితమని, మెత్తనిదనీ టాకూరుకు తెలుసు. టాకూరు, స్నేహితులు కలసి నా భర్తను పరిహాస చేస్తూం ఉండేవారు. ఎప్పుడూ ఏమాత్రం దయలేకుండా నా భర్తను పీడించేవారు. నాకు వివాహమై నప్పుడు గురుటాకూరు కాశీలో చదువుకుంటున్నాడు. నా భర్త వారి కయిన ఖర్చు లన్నీ భరించేవారు. కాశీనుండి వారు తిరిగి వచ్చేటప్పటికి నాకు 18 సంవత్సరాలుంటాయి.

నాకు పదిహేనో ఏట ఒక కొడుకు పుట్టాడు. నాకు చిన్నతనమగుటవలన బిడ్డను పెంచేవిధము బాగా తెలి యదు. ఆ ఊళ్ళోవారితో కబుర్లుచెప్పుకుంటూ కాలంగడిపే దాన్నికాదు. తండ్రికి మాత్రం పిల్లవాడంటే సంతోషంగా ఉండేది. నేను పిల్లవాణ్ని గారాబంగా చూడకపోయినా, పిల్లవాడు నన్ను అమితంగా ప్రేమించేవాడు. తనను విడిచి వెళ్ళిపోతానని వాడికి భయంగా ఉండేది. నేను పిల్ల

వాడీ దగ్గర ఉన్నప్పుడుకూడా నావంక నిరాశతో చూచే వాడు. నే నంత లక్ష్యము చేసేదాన్ని కాదు.

అది ఆగష్టుమాసం. వర్షాలు బాగా కురుస్తున్నవి పిల్లవాణ్ని తీసుకొని నదికి వెళ్ళాను. పిల్లవాణ్ణి చూస్తూ ఉండమని దాసీకిచెప్పి నదిలోకి దిగాను. నేను నదిలోకి వెళ్ళుతుంటే బిడ్డ బావురుమని ఏడ్చాడు.

నేను నదిఒడ్డుకు వచ్చినప్పుడు అచ్చట ఎవ్వరూ లేరు. నాకు ఈత బాగా వచ్చును. వర్షాలవలన నది హోరుగా ప్రవహిస్తున్నది. నేను నదిలోకి దిగాను. నేను కొంతదూరం వెళ్ళేటప్పటికి 'అమ్మా !' అనే శబ్దము విన పడ్డది. తిరిగి చూచేటప్పటికి పిల్లవాడు నెమ్మదిగా, నెమ్మదిగా మెట్లుదిగి నదిలోకి వస్తున్నాడు. పెద్దగా కేకలు వేశాను. వాడు నవ్వుకుంటూ 'అమ్మా ! అమ్మా !' అని కేకలు పెట్టుకుంటూ వస్తున్నాడు. నేను భయంతో వణికి పోతున్నాను. నా చేతులతో కళ్ళు మూసుకున్నాను. నేను మరల తెరిచేటప్పటికి నా పిల్లవాని నవ్వులు కేరింతలు మాయమైపోయినాయి. నేను ఒడ్డుకు వచ్చాను। పిల్లవాణ్ణి నీళ్ళనుండి బయటకు తీశాను. నా రెండు చేతులతో ఎత్తుకున్నాను. నాబిడ్డ నావంక చూడలేదు. 'అమ్మా!' అని పిలవలేదు. నాబిడ్డను నేను తిన్నగా చూడలేదు. ఇప్పుడు

దేవుడుగా మారాడు. బిడ్డను ఇదివరలో చక్కగా పెంచ నందుకు ప్రాయశ్చిత్తం అయింది. నా హృదయము చాలా బాధపడ్డది. నా బిడ్డ నాదగ్గర ఉన్నప్పుడు నేను ఒంటరిగా వదలివేసేదాన్ని. నావెంట తీసుకువెళ్ళేదాన్ని కాదు. ఇప్పుడు చనిపోయినాడు. వాని ఆత్మ నా హృదయంలో హత్తుకు పోయినది. నన్ను విడవకుండా వెంటాడు తున్నది.

నాభర్త ఎంత బాధపడ్డారో దేవునికి ఒక్కనికే తెలుసు. వారేగనుక నా పాపాన్ని క్షమించకుండా ఉన్న ట్లయితే, పరిస్థితి ఇంతవరకూ వచ్చేదికాదు. నేను విచా రములో క్రుంగి కృశించి పోతుంటే గురుటాకూరు వచ్చారు. వారంటే నా భర్తగారికి అమితమైన గౌరవం. గురుతుల్యులుగా చూచేవారు, వారేమన్నా అదంతా వేదంగా భావించేవారు. నాభర్త వారితో నా కేదైనా మనశ్శాంతిని కలుగజేసే మాటలు చెప్పమన్నారు, వారు వేదాలనుగూర్చి చెప్పటం ప్రారంభించారు. కాని అందువలన నా కేమీ ప్రయోజనం కలుగలేదు. వాటి ఉపయోగం వాటి ఉచ్చా రణలోనే ఉంది. దేవుడు దైవ సంబంధమైన జీవితాన్ని మానవుని హృదయంలోనే దానిని అనుభవించటానికి ప్రతిబింబింప జేస్తాడు. అంతకన్నా మరొకపాత్ర లేదు.

ఆపాత్రనుంచే దేవుడుకూడ దైవసంబంధమైన జీవితాన్ని అనుభవిస్తాడు.

దేవునిమీద ధూపము ఎట్లుండునో, టాకూరుమీద నాభర్తకు ప్రేమ, గౌరవాలు అలా వున్నాయి. ప్రతిరోజు గురువు మాయింటికి భోజనానికి వచ్చేవాడు. నేను నిద్ర నుండి లేవడంతోనే నాకు మొదటకలిగే ఆలోచన గురువు గారి భోజనం. అది దేవునియొక్క పవిత్రమైన బహుమతి అనుకునేదాన్ని. వారికి భోజనం తయారు చేస్తుంటే నా వ్రేళ్ళు సంతోషంతో పొంగి నాట్యం చేస్తూఉంటాయి. గురువుగారిమీద ఉన్నభక్తిచూచి భర్త పొంగిపొయ్యేవారు. గురువువద్దనుండి గౌరవము సంపాదించుకోలేదని నాభర్త విచారపడేవారు.

ఈవిధంగా ఆయిదు సంవత్సరాలు గడిచినాయి. నా జీవితమంతా ఇలాగే గడిచిపోతుందని అనుకున్నాను. అయితే ఈ జీవితానికి చాటున దొంగతనం - అనుకోనట్లు జరుగుతున్నది. నేను దానిని కనిపెట్టలేక పోయినాను. కాని నా హృదయంలో ఉన్న దేవుడుమాత్రం కనిపెట్టాడు. మా జీవితమంతా తారుమారయ్యే రోజు వచ్చింది.

అది మండు వేసవికాలం. నేను ఉదయాన్నే నదికి వెళ్ళి స్నానం చేసి, తడిసిన గుడ్డలతో ఇంటికి వస్తు

న్నాను. రోడ్డు మలుపువద్ద ఒక మామిడి చెట్టువున్నది, అచ్చట గురుటాకూరును కలుసుకున్నాను. వారి వంటిమీద ఒక కండువా ఉన్నది. సంస్కృత శ్లోకములు చదువు కుంటూ నదికి స్నానానికి వెళుచున్నారు. నా ఈ వేషంతో వారిని చూచుటకు నాకు చాలా సిగ్గుగా ఉంది. వారికి కని పించకుండా వెళ్ళుటకు తొందరగా నడిచాను గాని, వారు నా పేరుపెట్టి పిలిచారు.

తల వంచుకుని వారియెదుట నిలబడ్డాను. వారు నా వంక చూచి 'నీశరీరం ఎంత అందంగా ఉంది'! అన్నారు.

ప్రపంచంలో ఉన్న పక్షులన్నీ కలసి చెట్ల మీద పాట పాడుతున్నాయా అన్నట్లు అనిపించింది. వీధులలో ఉన్న పొదలన్నీ పుష్పాలతో వికసిస్తున్నట్లు కనిపించింది. ఆకాశము, భూమి అంతా ఆనందంతో నృత్యం చేస్తు న్నట్లుతోచింది. నేను ఇంటికి ఎలా జేరానో నాకు తెలి యదు. నేను వెంటనే దేవుణ్ణి పూజ చేసే గదికి వెళ్ళి నట్లు మాత్రం జ్ఞాపకం ఉంది. గదంతా నిరాయమంగా ఉంది. తళతళమని మెరయు వెలుతురుమాత్రం నాకళ్ళకు కన్పట్టుచున్నది.

గురుటాకూరు ఆ రోజు మా ఇంటికి భోజనానికి వచ్చారు. నే నెక్కడికి వెళ్ళానని నా భర్తను అడిగారు.

వారు నా కోసం వెతికారు. నేను ఎక్కడా కనిపించలేదు. ఆ రాత్రి నా భర్తగారిని కలుసుకోవాలి. రాత్రి చీకటిగా ఉంది. వారు చీకటిలో మాట్లాడటం నేను విన్నాను. నాకు ఆశ్చర్యంగా ఉండేది. ఒక్కొక్కప్పుడు నా పనంతా ముగించుకొని పడుకోటానికి వెళ్ళేప్పటికి ఆలస్యమయ్యేది. నా భర్త నాకోసం ఎదురుచూస్తూ క్రింద కూర్చునేవారు. మా సంభాషణ మా గురువుగారితో ప్రారంభ మయ్యేది.

ఆరాత్రి గదిలో నాభర్త నేలమీద పడుకొని నిద్ర పోతున్నారు. వారిని లేపకుండా వారిపాదాలవద్ద తలపెట్టి పడుకొన్నాను. నిద్రలో వారిపాదాలు పెట్టి నా హృదయం మీద తన్నారు. అదే వారి ఆఖరు వీడ్కోలు. వారు నిద్ర నుండి లేచేటప్పటికి నేను వారి ప్రక్కనే కూర్చొని వున్నాను. అప్పటికి బాగా తెల్లవారలేదు, కాకులు 'కావు, కావు' మని కూయుటలేదు. వారి పాదాలకు దండం పెట్టాను. వారు కలగంటున్నట్లుగా నావంక జూస్తున్నారు.

'నేను నిశ్చయించుకున్నాను. ఈ ప్రపంచం వదలి పెట్టాలి. ఇంక నేను మీదాన్నికాదు. మీయిల్లు విడిచి వెళ్ళక తప్పదు' అన్నాను.

బహుశా వారు యింకా కలలోనే వున్నా రనుకుంటాను, ఒక్కమాటగూడా మాట్లాడలేదు.

'నామాట వినండి, నన్ను అర్థంచేసుకోండి. మీరు మరల వివాహం చేసుకోండి. ఇక సెలవు తీసుకొంటా:'

'ఏమిటి. ఈ పిచ్చి మాటలు. నిన్నెవరు వెళ్ళ మన్నారు' అన్నారు.

'గురుటాకూరు.'

నాభర్తకు అయోమయంగావుంది. 'గురుటాకూరు' అని బిగ్గరగా అరిచారు. 'ఎప్పుడిచ్చారు నీకీ సలహా' అని అడిగారు.

'నేను నిన్న ఉదయాన్న నదిలో స్నానంచేస్తుంటే సలహా ఇచ్చా'రని చెప్పాను.

వారి గొంతుక బొంగురు పోయింది. నావంక చూస్తూ 'నీ కెందుకిచ్చారు అట్టి సలహా ?'

'నాకు తెలియదు. వారినే అడగండి.'

'నేను గురువుగారితో మాట్లాడతాను. నాయిల్లు వదిలి వెళ్ళనవసరం లేదు. ఇక్కడ ఉంటూనే ఈ ప్రపంచం వదలి వెళ్ళవచ్చును.'

'మీ గురువు మీ వినతి ఆలకించవచ్చును. నా హృదయం మాత్రం సమ్మతించదు. తప్పకుండా ఈ ఇల్లు వదలి వెళ్ళాలి. ఇకనుంచి ఈ ప్రపంచంతో సంబంధం లేదు.'

మాట్లాడకుండా కొంతసేపు కూర్చున్నాము. తెల్లవారిన తరువాత గురువుగారి వద్దకు రమ్మన్నారు.

రెండుచేతులతో దండం పెట్టాను. 'నేను వార్ని ఎన్నటికీ కలుసుకోను.'

నేను వారివంక చూచాను. తలవంచుకున్నాను. వారేమీ మాట్లాడలేదు. వారు నా మనస్సు గ్రహించి అర్థం చేసుకున్నారు. ఈ ప్రపంచంలో నన్ను ఇద్దరే మిక్కిలిగా ప్రేమించారు. నా బిడ్డ. నా భర్త. అందులో ఒకరు నన్ను వదలి వెళ్ళారు. నేను మిగతావారిని వదిలాను. ఈ ప్రేమే నా దేవుడు. దానికి అసత్యం తెలియదు. నా కిప్పుడు నిజమే కావాలి.

ఆమె నా పాదాలవద్ద ఉన్న మట్టిని తాకింది. నమస్కారంచేసి వెళ్ళింది.